ఓమ్

# సుమతి శతకము.

గ్రంథకర్త

బ్రహ్మశ్రీ

రాళ్లభండి రాజయ్యాకవి

చింతిరేల (నైజాం)

1938

సత్తైనపల్లి శ్రీ కృష్ణాముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

మొదటికూర్పు 1000 ప్రతులు.

చ ౧౫ ఫరవర్ది ౧౩౪౭ ఫసలీ

# పండితాభిప్రాయము.



చ॥ సతతముదుష్టకృత్యములసల్పుచుముక్తికిదూరులైన దు
ర్మతులదరింపజేయగ సమస్తహితోక్తులనొప్పునట్టి యీ
శతకముగూర్చుటెంతయుబ్రశస్తముతానుధరించినట్టి వా
డితరుతరింపజేయుట మహాన్విధియంచుదలంపరేబుధుల్

సత్తెనపల్లి,
16 2 38

ఉభయభాషాప్రవీణ,
వారణాసి లక్ష్మీనారాయణశాస్త్రి,
ప్రధానాంధ్రోపాధ్యాయుడు,
శ్రీశరభయ్యగుప్త హిందూహైస్కూలు.

బ్ర. శ్రీ రాళ్లభండి రాజయ్యగారు వీరు నైజామిలాకా నల్లగొండజిల్లా హుజూరునగరు తాలూకా చింతిరేల గ్రామనివాసులు కృష్ణానదీపావనోదకములచే ప్రసిద్ధమగు

స్థలమందు జనియించిన కవివతంసులు కుమతిశతకమును సాంగముగా తిలకించునంత కాశము నాకొసంగిరి పద్యములు హృద్యములై నీతి దాయకములై ప్రకృతిరహస్యోపేతములై లోకోక్తి సమన్వితములై సర్వజనానురంజకములై యొప్పుచున్నవి శతకన్నామమును వినినతోడనే పొడమునందియము శత కమును జదువ ప్రారంభించిన తోడనే వీడకతప్పదు. కవి తత్వవేత్తయగుట పచ్చుటచ్చుట వేదాంత విషయములు పొందుపరచుటయేగాక మరికొన్ని వేదాంతగ్రంథములును వ్రాసియున్నారు బాలురుమొదలు వృద్ధులవరకు నీశతక మును చదివితీరవలెనని ఘంటాపథముగ చాటుటకే మా త్రము సంశయములేదు. గనుక వీరింక అనేక గ్రంథముల రచియించి ఆంధ్రలోకోపకారమొనర్ప వలెనని నా ఆశయము.

తక్కెళ్లపాడు, 11-2-38. — కన్నెగంటి ప్రభులింగాచార్యులు శతావధాని, పల్నాటిసోదరకవులు.

# సరస్వతీ స్తవము

చ॥ కమలజురాణి మద్హృదయ
　　కంజమునన్ వసియించిసత్కృపన్
సముచిత నీతివాక్యములు
　　శ్లాఘ్యముగన్ సుధ జిల్కబల్కుచున్
అమరులుమెచ్చగన్ కృతి స
　　మంచితలీలల బూర్తిజేయగన్
సమరసభక్తినిన్ గొలుతు
　　శ్రావ్యతరంబగు సంస్తవంబుచేన్

శ్రీ

# కుమతి శతకము.

శ్రీ మద్రవికుల మండన
శ్యామాంగా భక్తరాజ సన్నుతసుగుణో
ద్దామ అయోధ్యాపుర సం
ధామాద్రైత్రేయభీమ ♦ దశరధరామా 1

కం॥ సుమతియను శతకమున్నది
కుమతిశతకమెచట లేమి ♦ గూర్చితినిటులక్షా
గమినింపతగును దీనిని
కుమతియేమియనెడు శంక ♦ గోరక కుమతీ. 2

కం॥ సుమతికి యేటికి నీతులు
కుమతికిజెప్పవలెగాని ♦ క్షోణీస్థలిలో
కుమతిని బాగొనరించిన
సముదంచత్పుణ్యమబ్బు ♦ చయ్యనకుమతీ. 3

కం॥ కనుక నెచెప్పెద నీకిటు
విసుమాయీనీతులెల్ల ♦ విశదముగాగన్
జనియించు జ్ఞానసంపద
దినదినమభివృద్ధియగును ♦ దీనన్ కుమతీ. 4

కం॥ ప్రొద్దున నెలేచి శుద్ధిగ
పెద్దలకడకేగి మిగుల ♦ ప్రేమదలిర్పన్
పద్ధతిగా వందనమిడి
సుద్దులు వినుచుండువాడె ♦ సుగుణుడు కుమతీ. 5

కం॥ బీదలుసాధులు బాపలు
మోదముతోనింటదిగిన ♦ మొక్కి భుజింపన్
లేదనక కలుగుదానినె
భేదములేకుండ నిడుము ♦ ప్రీతిగ కుమతీ. 6

కం॥ దేవబ్రాహ్మణ వృత్తుల
గావింపకు నాశనంబు ♦ గలిగినశక్తిన్
రావించి యిహపరంబుల
సేవింపుము యశము ముక్తి ♦ జేకురు కుమతీ. 7

కం॥ ఇద్దరు గూడొక్కని కెలఁగ
పద్దగమాటాడుచుండ ♦ బరుగునఁదటకున్
బుద్దివిహీనత బోయిన
గద్దింతురు నిన్ను వారు ♦ గనుగొని కుమతీ 8

కం॥ పెద్దలతో వాదించుచు
గద్దరిగామాటలాడి ♦ గదమకు మెపుడున్
పెద్దరికము ధరనిలువక
ముద్దుగనటియింతు వేని ♦ ముక్తిర కుమతీ. 9

కం॥ వేదబ్రాహ్మణ ఋషులన్
సాధులనాదేవతలను ♦ సద్గురునిలలో
శోధించి గేలిజేయుచు
బాధించినగూడు ఘోర ♦ పాపము కుమతీ. 10

కం॥ సరసములాడకు మెప్పుడు
విరసముగా బరిణమించి ♦ వికటించుసుమీ
మురిసిన వెంటనె తప్పక
వరుసన ఖేదంబునీకు ♦ వచ్చుర కుమతీ. 11

కం॥ బిఁసనైన హయము నెక్కకు
దురుసుగమాటాడి శ్రుతుల ♦ దూషింపకుమీ
కురుచయగు బుద్ధివిడువుము
పరమాత్మున్ గొల్వుమెపుడు ♦ భక్తిన్ కుమతీ. 12

కం॥ చింతయొనర్పకు సిరికై
కాంతలతో కలహమునకు ♦ కాల్దువ్వకుమీ
సంతతమును శ్రీగిరిజా
కాంతున్ భజియించి ♦ ముక్తిగాంచుము కుమతీ. 13

కం॥ పంతులని చెవినిబడగా
దొంతులచాటునకుబోయి ♦ దొరకక బడిలో
సుంతయు నిల్వకదిరుగుచు
రంతులుజేసినను చదువు ♦ రాదుర కుమతీ. 14

కం॥ దుడుకుతనంబన గూడదు
కడుప్రేమన్ బీదజనుల ♦ గాంచుము మహిలో
దడిపింపగూడదెవరిన్
చెడువారల చెలిమిచేయ ♦ జేరకు కుమతీ. 15

కం॥ పడుచులను చూచి కోరకు
చెడుమాటల నెప్పుడే న్న ♦ చింపకు మింటన్
బడియుండుము ధరలోన
క్కుడుకీరితి నీకు సతము ♦ గూడుర కుమతీ. 16

కం॥ అప్పిచ్చువారియెడ నీ
వెప్పటికిని తప్పు వెదకి ♦ యోమాత్రింబుక్
ముప్పుగలిగింపబోకుము
తిప్పలు బెట్టకుము ఋణము ♦ తీర్పుము కుమతీ. 17

కం గుడికేగిన బడికేగిన
పెడముఖమున బోకు మెపుడు ♦ పెద్దలగనుచో
చిడిముడులాడన్ గూడదు
పుడమిదొరల యెదుటనీవు ♦ బొంకకు కుమతీ. 18

కం॥ కసిమిడి యెద్దును గొనకుము
విసిగించును నిన్ను మిగుల ♦ వేసవియందున్
బుసగొట్టి రొప్పుచుండును
పస జెడుట యొకాక కృషియు ♦ పాడగు కుమతీ. 19

కం॥ కులవిద్యలో ప్రవేశము
గలుగనియెడ బ్రతుకుదెరువు ♦ గానని యెడలన్
విలపింపక కృషి, బేరము
సలుపుము చౌర్యంబు జేయ ♦ సాగకు కుమతీ. 20

కం॥ దిసమొలనుండుటకూడదు
పసిబాలురతోడగూడి ♦ పంతులుకడకున్
మసిగుడ్డ నెసదాల్చి
పసమీరగ నరిగిచదువ ♦ వలెరా కుమతీ. 21

కం॥ రుచికలదని మితిమించక
నుచితముగా వచ్చుననుచు ♦ నోపికతో నీ
వెచలేనియు భుజియింపకు
పచనముగాకున్న మేన ♦ బామగుకుమతీ. 22

కం॥ వరుసయగుకామినులగని
సరసంబుల నాడబోకు ♦ సరసుడవగుచో
నిరతిశయానందమునకు
బురికొల్పుముమనము ♦ నెపుడుపొందుగకుమతీ. 23

కం॥ వరసయు వావియు లేకయ
దిరుగాడెను దాని చేర ♦ దీసినముప్పౌ
మరువకు మెన్నడు దీనిని
గురుబోధయు యిద్దినీకు ♦ గురుతౌ కుమతీ. 24

కం॥ తగువాడదలచినప్పుడు
తగసల్పుమ యింటనీకు ♦ తరుణీమణితో
బగలంత జేయు జగడము
దిగనాడియు రేయి రతుల ♦ దేలరకుమతీ. 25

కం॥ మేలుఃనకిడలోదలచిన
వాలాయంబెంతో బీద ♦ వారల కిడుటల్
చాలగ వాడినపైరుకు
పీలుగవర్షించువాన ♦ విధమున కుమతీ. 26

కం॥ బాకీ నిడలోదలచిన
తేకువగా బ్రాహ్మణునకె ♦ తెంపుగనిడనా
రాకున్నన్ ఫలమబ్బున్
నీకిహపరసుఖములొదవు ♦ నిజముగ కుమతీ. 27

కం॥ దానములజ్ఞాఁడదెలియుము
దానఫలంబొదవు నీకు ♦ తప్పక యెపుడున్
దానములలోన నుత్తమ
దానమ్ము నిదానమనుచు ♦ దలపర కుమతీ. 28

కం॥ మొగమోటమిచే న్యాయము
దిగనాడుచు నిష్టమైన ♦ తీర్పులుదీర్పన్
దగదనుచు దెలిసిబంధువు
పగయందును నొక్కటిగనె ♦ పల్కర కుమతీ. 29

కం॥ వడ్డీకాశవహించుట
అడ్డముతానొకనికుంట ♦ అవనీస్థలిలో
చెడ్డతనము గావుననది
విడ్డూరపుపని యటంచు ♦ వెరచుము కుమతీ. 30

కం॥ నిజమాడు వానికిలలో
భుజియించుటకు గూడు లేదు ♦ పోనిమ్మని నీ
సుజనత విడువకు మెప్పుడు
కుజనుడవై యనృతమాడ ♦ గూడదు కుమతీ. 31

కం॥ భజియించు బ్రహ్మవేత్తల
ద్విజులను సాధులనుమునుల ♦ దేవతలనెదఁ
నిజమైన పదవిదొరకును
గజబిజియగు సూచితంబు ♦ గాలురఁ సుమతీ. 32

కం॥ పథ్యము జెరచినరోగము
నిత్యముగాతిరుగబెట్టి ♦ నీల్గగజేయున్
మృత్యువునకె అది జెరచుట
సత్యమునామాట వినుము ♦ చాలుగ సుమతీ. 33

కం॥ భగవంతుడు నీకిచ్చిన
తెగువఁ నీకడుపునిండ ♦ దిని సౌఖ్యమునఁ
తగినంతయొరుల కొసగుము
సగముఁ సగమైన నిడిన ♦ జాలును సుమతీ. 34

కం॥ గుడిపెత్తనంబు జేయకు
మొడబాయకుగురుని సేవ ♦ నెప్పుడుఁభక్తిఁ
పుడమిఁ జనించి నందుకు
మడిదున్నక బ్రతుకమంటి ♦ మహిలో సు. 35

కం॥ కన్యావిక్రేతలకడ
నన్యులుభుజియింపగూడ ♦ దదియెట్లన్నన్
కన్యావిక్రయ విత్తము
మాన్యులకిలదలపగోవ్రు ♦ మాంసము కుమతీ. 36

కం॥ ధనమున్న దనుచునెప్పుడు
మనమునగర్వింపబోకు ♦ మత్సరమున స
ద్వినయముగోల్పిన జగతిన్
బనులన్నియుచక్కనౌను ♦ బాగుగ కుమతీ. 37

కం॥ నినునీవుబొగడు కొనకుము
ఘనముగపరనిందజేయ ♦ గడగకు మెప్పుడున్
పనిమాలితిరుగ బోకుము
అనుమానంబున్నచోటు ♦ కరుగకు కుమతీ 38

కం॥ పగవాని యింటదినుటయు
బగవానికి కుడువనిడుట ♦ బారుటయనిలో
తగవున్నచోట నిల్చుట
మగువకుగోప్యంబు తెలుప ♦ మానర కుమతీ. 39

కం॥ ఆకలియుడిగిప కుడుపును
పాకమ్మొనరింపలేని ♦ పడతులబ్రతుకుల్
పోకిరివారల నటనలు
లోకములోఁజూడఁజాల ♦ లోపము కుమతీ 40

కం॥ వరదక్షిణ ఇడకున్నన్
ధరలోపల పెండ్లిజేయ ♦ దరమావగుడా
కరవయ్యె కన్యకెట్లని
పరమార్థము జెరచబూన ♦ వలదార కుమతీ. 41

కం॥ నమ్మకు వేశ్యల వైశ్యుల
నమ్మకు మపసవ్యస్త్రీల ♦ నమ్మకుజడులన్
నమ్మకుజారుల చోరుల
నమ్మకుమాత్రాగుబోతు ♦ నరులను కుమతీ. 42

కం॥ శరణన్నవారి జెరచకు
కరుణ నభయ మొసగివేగ ♦ గావుము ధరలో
సరిరారు నీకునెవ్వరు
పరమార్థము నాదు మంచి ♦ పద్ధతి కుమతీ 43

కం॥ వంచింప నెంచ కెవరిని
ముంచకు మాబాకిదార్ల ♦ మోసమొలర్పన్
పెంచకు మెదలో నీర్ష్యం
బుంచకు ఋణశేషమనని ♦ నొప్పగ సుమతీ. 44

కం॥ టక్కరిమాటల జెప్పకు
మక్కువగా నిజముబల్కు ♦ మర్మమువిడి నీ
వెక్కడ నైనన్ మితముగ
చక్కరతీసియన ధాత్రి ♦ చయ్యన సుమతీ. 45

కం॥ శ్రమ జేసి చదువుమయ్యా
జమ జేతువు ధనముమిగుల ♦ జగతీస్థలిలో
శ్రమదీరు సార్ధకంబగు
గుమిగూడి నుతింత్రు వేడ్క ♦ గొననిను సుమతీ. 46

కం॥ జూదములాడుట బిడ్డల
వేదమ్ముల నమ్ముకొనుట ♦ వెలదులతోడన్
వాదించుట పంక్తులలో
భేదముజూపుట అధర్మ ♦ వృత్తిర సుమతీ. 47

కం॥ ఇలసంసారము జేసిన
పలువురు నేర్చెడు తెఱంగు ♦ బాగుగు సిరితో
నలువురు నవ్వగ జేసిన
ఫలమేమిరసతము పస్తు ♦ బాడుచు కుమతీ. 48

కం॥ పరువిచ్చి పరువుగాంచుము
బరులకు మర్యాద జేయ ♦ బాల్పను మెప్పుడున్
దొరయైన నీచుడైనన్
పరువుగ మాటాడగొప్ప ♦ పద్ధతి కుమతీ. 49

కం॥ తానను భవింపనోల్లక
దానము ధర్మంబు లేక ♦ ధనధాన్యములన్
కోనన్ దాచిన తుదకవి
మానవనాథునకు గాక ♦ మానవుకుమతీ. 50

కం॥ కుటిలురు జెప్పిన వాక్యము
లెటువంటివో తెలిసికొమ్ము ♦ యింగితమునలో
దిటమొనరింపుము నీపని
మటుమాయపుమాటలనుచు ♦ మానుచుకుమతీ. 51

కం॥ మాసినవలువలు గట్టకు
పాసినయన్నంబు బండ్ల ♦ భక్షింపకుమీ
నాసికము సభను జీదకు
మోసముగల పనులనెపుడు ♦ ముట్టకు కుమతీ. 52

కం॥ కూర్చుండదలచినప్పుడు
మార్చకయుండెడు స్థలంబు ♦ మనమునముందే
యేర్చుకొని చూచికూర్చొన
దీర్చినసభవారు మెచ్చు ♦ తెలివదికుమతీ. 53

కం॥ కోరకుమెప్పుడు నేదియు
కోరకయేవచ్చు నీవు ♦ కుడువగనున్నన్
కోరినవచ్చునె రానివి
కోరకరాకున్నవేళల ♦ గొనుటయు కుమతీ. 54

కం॥ క్షితిలోన మంచిపనికై
జతగూడరు రమ్మటన్న ♦ జగడంబనినన్
ప్రతిమనుజుడు కాల్దువ్వన్
అతులితముగనెల్లవేళ ♦ లందునకుమతీ. 55

కం॥ సిరివచ్చిన ధర హెచ్చిన
బరువడిగా నేరువచ్చి ♦ పారినక్షితిలో
కరువొకటి యావరించిన
స్థిరముగనుండవనుమాట సిద్ధము కుమతీ 56

కం॥ బాగుపడెడు వాడితరుల
బాగేతనబాగటంచు ♦ భావించుమదిన్
ఓగుపడువాడు సతతము
నోగేయితరులకు గోరు ♦ నొప్పుగ కుమతీ. 57

కం॥ కష్టమువచ్చిన వెంటనె
నిష్ఠురములనాడి దైవ ♦ నిందయొనర్పన్
భ్రష్టత్వమొదవు నీవది
స్పష్టముగా దెలియవలయు ♦ జగమున కుమతీ. 58

కం॥ వాసిగ కృష్ణాతీరము
భాసురమగు కాశియనుచు ♦ పరమమునీంద్రుల్
వాసముజేసిరి వరుసగ
భాసిల్లును బుణ్యమిచట ♦ బాగుగ గుమతీ. 59

కం॥ గురుశుశ్రూష యొనర్పక
మరచియు మంత్రంబు జేర ♦ మఱియొక గురువున్
నరునకు తప్పదు నరకము
మరియెన్నడు జేయకిట్లు ♦ మహిలో కుమతీ. 60

కం॥ వింతలమారిదిలోకము
చింతలకాస్పదముగాన ♦ స్థిరమా సుఖమా
వంతయులేదిక యేటికి
బొంతదగులవేసి ముక్తి ♦ బొందుముకుమతీ. 61

కం॥ సర్వముతానైయున్నన్
పూర్వాచారంపువిధుల ♦ బూనుచునీవి
యుర్విని దిరుగుచు సాక్షిగ
నిర్వాణసుఖంబుజెంద ♦ నేర్చుము కుమతీ. 62

కం॥ సరసజ్ఞుడ నేననియెడి
బరువెంతయు నెత్తికొనక ♦ భక్తుడవనుచున్
గరువముబొందక నిరతము
గురువులసేవించి ముక్తి ♦ గొనరా కుమతీ. 63

కం॥ నొసటన్ వ్రాసిన వ్రాలది
మసిబొట్టయినకాక ♦ మఱియొకటైనన్
వెసదుడిచి వేయవచ్చును
మసిగాదది బ్రహ్మవ్రాత ♦ మారదుకుమతీ. 64

కం॥ తుమ్మినపయనము గాకుము
నెమ్మదిగానొక్కనాడు ♦ నెలకొనియింటన్
సమ్మతిగ మరుదినంబున
బొమ్మనివచియింత్రు సర్వ ♦ బుధులిల కుమతీ. 65

కం॥ కుందేలెదురైనప్పుడు
తొందరపడిపోకు నీకు ♦ తోడగుమృతియున్
ముందలరకృష్ణ సర్పము
పొందుగవామాంసంబులారు ♦ బోకుర కుమతీ. 66

కం॥ వినుపయనపు ప్రారంభం
బున కాకమ్మొడమనుండి ♦ బోయినకుడికిన్
ఘనమైన మేలుగల్గును
చననెడమకు గొప్పకీడు ♦ సత్యముకుమతీ. 67

కం॥ పిల్లియెదురైన బోకుము
మళ్లుమునీవింటికపుడె ♦ మఱియొకనాడున్
వెళ్లగదలచినచో మూ
ణ్ణాళ్లుండియునాపయిజ ♦ నందగు కుమతీ 68

కం। మీరకుమీతలి దండ్రుల
చేరకుమీదుష్టజనుల ♦ చెంతకు నెపుడున్
కోరకుగా కుండెడిపని
ఏరకుమీబుధులతప్పు ♦ లేవియు కుమతీ. 69

కం॥ పచ్చికకై పశువులు ముని
ముచ్చులుదోపిళ్లకొరకు ♦ మూర్ఖులనికిబల్
మెచ్చుచువత్తురు గావున
హెచ్చరికన్ కలిగియుండు ♦ మెప్పుడు కుమతీ. 70

కం॥ ఎప్పుడుశ్వానము లేడ్చిన
తప్పకతద్గ్రామమున కొ ♦ దవుకీడెంతో
ముప్పగును గృహముసందున
గొప్పగజగడంబు రోజు ♦ గూడదు కుమతీ. 71

క॥ సారాత్రాగెడి వారికి
జీరాడునుకట్టుపంచ ♦ సిగ్గరిబోవన్
నోరాడతగులు తన్నులు
మాఘాడిన బాధమిడక ♦ మానరు కుమతీ 72

క॥ పెద్దలుజెప్పెడి మాటలు
చద్దులమూటలని తెలిసి ♦ సఖ్యముతోడన్
యొద్దికతోదా నెప్పుడు
పద్ధతిగానడచువాడె ♦ ప్రాజ్ఞుడు కుమతీ. 73

క॥ పాపముపుణ్యం బెరుగక
నోపికతోక్రుధనువిడక ♦ నొప్పుగనహామున్
కాపకమెట్లగుముక్తుకు
పాపటనరువగ నెగాదు ♦ పతిహిత కుమతీ 74

క॥ మతికుదిరిన గతిగుదురును
శ్రుతికుదిరిన పాటగుమను ♦ సొంపుగనుండున్
సతి సతి యగుచో సుఖమగు
హితమొదవిన యీాటెకత్తె ♦ యింపగు కుమతీ. 75

కం॥ కరణీక మబ్బినంతన
అరుణోదయమట్లు తెలివి ♦ యద్భుతమగు ని
ద్ధరిణిని నెవ్వానికైనన్
కరుణయునాతనికి వాక్యగతమగు కుమతీ. 76

కం॥ మోదమున ప్రొద్దుబోకయె
వాదప్రతివాదములుగ ♦ వరసన్ నేనీ
వాదముసల్పితి నీతిగ
పాదైయాలోకమందు భాసిల కుమతీ. 77

కం॥ చందంబుచదివి యెరుగను
కందములన్ జెప్పినాడ ♦ గావునదీనన్
సందియములున్న దిద్దన్
వందనములొనర్తు నార్య ♦ వరులకు కుమతీ. 78

కం॥ నగుబాటు శతకమంచున్
నగివీారెగతాళిచేసి ♦ నన్నపుడిలలో
తగనింద జేయవలదని
పొగడెదనే బుధులనెపుడు ♦ పొలుపుగ కుమతీ. 79

కం॥ తప్పులను దిద్దియిందున
నొప్పులసమకూర్చి వేగ ♦ నోపికతోడన్
తప్పక గ్రంథము సాంతము
ముప్పదిగా జూడుమంచు ♦ మ్రొక్కెద కుమతీ. 80

కం॥ భారద్వాజస గోత్రుడ
కూరిమినరసింహ య్యాఖ్యు ♦ కొమరుడనై సీ
తారమణికి పిచ్చమకున్
నేరమణుడనైతి ధారు ♦ణీస్థలి కుమతీ. 81

కం॥ క్షితివెంకట లక్ష్మాంబా
సుతవర్గమునందు నగ్ర ♦ జుడనై జన్మిం
చితి శ్రద్ధదోపగా జె
ప్పితి నీకీనీతులెల్ల ♦ వినరా కుమతీ. 82

కం॥ నైజాము రాష్ట్రమందున
భూజననుత చింతిరేల ♦ పురిమునసబుగా
రాజాజ్ఞా బద్ధుడనై
నేజరిపితినలుబదేండ్లు ♦ నిష్ఠన్ కుమతీ. 83

కం|| శ్రీరాళ్లభండి వంశో
ద్ధారకుడఁ రాజయోగి ♦ దాసుడ నేనీ
సారతరంబగు శతకము
కూరిమి జేకూరునట్లు ♦ గూర్చితి సుమతీ. 84

కం|| కృష్ణా తీరనివాసుడ
కృష్ణాప్తునినీలగళు ♦ భజించెడివాడఁ
విష్ణుతనూజాన్వయ వ
ర్ధిష్ణుడవిద్వత్ప్రియుండ ♦ ధీరుడ సుమతీ: 85

కం|| ప్రవిమల మానసభక్తి
స్తవమగు శ్రీనీలకంఠ ♦ శతకంబేనున్
జవసంపూర్తి యొనర్చితి
భవరహితము దానిచదువ ♦ బాగుగ సుమతీ. 86

కం| రవిసోములుండు వరకుఁ
భువిలో నీశతకమధిక ♦ పూజ్యంబనగఁ
ప్రవిమలగతి వెలిగెడున
క్కవిరాజున కమితయశము ♦ గల్గగ సుమతీ. 87

కం॥ ఈశతక మెవ్వ రేనియు
నాస క్తినిచదివివ్రాసి ♦ నత్తైనమహా
క్లేశమ్ములనడచి ఉమా
ధీశుడుమోక్షంబు నిడుట్టి ♦ తీర్థలి కుమతీ. 88

కం॥ సిరిసంతు పరిణయంబులు
కరితురగాందోళికాది ♦ ఘనవాహనముల్
దొరతనము ఛత్రచామర
పరివారము పాడిపంట ♦ ప్రబలుర కుమతీ. 89

కం॥ గురురాయు కరుణచేతన్
పరిపూర్తియొనర్చినాడ ♦ పద్యములనికన్
సరిపుచ్చెద మరియొక్కటి
విరచించెద వేమనార్య ♦ విధముగ కుమతీ. 90

కం॥ జయ సీతారామహరీ
జయనారాయణముకుంద ♦ జయగోవిందా
జయవిష్ణు నారసింహా
జయకృష్ణయటంచుబల్కు ♦ జయముర కుమతీ 91

కం॥ కందములను పువ్వులచే
సుందరమగుమాలఁగూర్చి శుభములనెల్లన్
జెందఁగ శ్రీరామునిగళ
మందున వేసితినియెల్ల ♦ రానన కుమతీ. 92

కం॥ రాయవరపురము నందున
స్థాయియగుచిదంబరాఖ్య ♦ సద్గురుకృపచే
పోయెన్ జన్మము లింతట
వేయురజయభేరి జగము ♦ వినఁగన్ కుమతీ. 93

కం॥ ఏమహనీయుడు జెప్పెనో
యీమహిలో సుమతిశతక ♦ మింపుదలిర్పన్
యామహిమన్ గొనియాడుచు
నామహిమాఢ్యునకు మ్రొక్కు ♦ మనెదన్ కుమతీ. 94

కం॥ ధరవేణు గోపబాలుడు
కరుణాకరుడైన నీల ♦ కంఠేశ్వరుడున్
చిరయశమునొసగి నినునను
మరువక బ్రోచెదరు గాక ♦ మక్కువ కుమతీ. 95

కం॥ స్థిరలీల నిలువగానీ
శ్వరవత్సర చైత్రకృష్ణ ♦ సప్తమిశశి వా
సరమందున యీశతకము
పరిపూర్తియొనర్చినాడ ♦ భక్తిఁ కుమతీ. 96

కం॥ శాంతమున సంచరించుము
స్వాంతమురంజిల్ల నీతి ♦ చాటితిభువిలో
భ్రాంతిఁ జెందకు మికనీ
కెంతో యశమొదవుముక్తి ♦ యొసగుఁ కుమతీ. 97

కం॥ పరమపదంబున జేరుము
నిరుపమ నిర్వాణ ♦ లక్ష్మినీకులభించుఁ
స్థిరమగునానందము జే
కురు శివజీవైక్యసిద్ధి ♦ జేకురు కుమతీ. 98

కం॥ శ్రీరామ రామయనిమది
నారూఢిగభజనజేసి ♦ యతులితభక్తిఁ
శ్రీరాముని కృపచేతఁ
నోరూరగనీతులెల్ల ♦ నుడివితి కుమతీ. 99

కం॥ కుమతివిని సీతులెల్లన్
సుమతిగస్వస్థానమునకు ♦ సుఖముగనరిగెన్
భ్రమవదలి బ్రహ్మపదవిని
రమియించెన్ గానజన్మ ♦ రహితము కుమతీ 100

కం॥ శ్రీకర మంగళదాయక
ప్రాకటసీతాకళత్ర ♦ భవ్యచరిత్రా
లోకాతీత పరాత్పర
చేకొనుమిదె మంగళంబు శ్రీరఘురామా. 101

మంగళము రామచంద్రా
మంగళము పవిత్రగాత్ర ♦ మాన్యచరిత్రా
మంగళము రవికులోత్తమ
మంగళము కృపాసమేత ♦ మహిజానేతా. 102

గద్య

బ్రహ్మశ్రీ రాళ్లభాండి రాజయ్య

గారిచేత రచింపబడిన

సుమతి శతకము

సంపూర్ణము.

